# నవత

## (వచన కవితా సంకలనం)



పదికోట్ల స్నిగ్ధ నేత్రాల వెలుగు
అయిదు కోట్ల చైతన్య గళాల ఎలుగు
తెలుగు గుండెల
భావసమైక్యతా సమారాధనకు
ఇవే మా హృదయపూర్వక
శుభాభినందనలు



సమతారచయితల సంఘం.
జిల్లా ఉపగ్రంథాలయం
అమలాపురం.

# అంకితం

సహృదయ సాహితీ స్వరూపులు.

శ్రీ కోనసీమ బానోజీరామర్సు కళాశాల

పాలకవర్గ సభ్యులు

శ్రీ R V. S. సూర్యనారాయణరాజు

B. A. B. L గార్కి

కృతజ్ఞతలతో

స. క. సం.

అమలాపురం.

# ముద్దూ - ముచ్చట

అవునండీ...మీతోనే... ఆఁ ఏముందీ కాస్త ముద్దూ ముచ్చటా...ఆఁ మేమే స.ర.సంవాళ్ళం...అబ్బే పెద్దగా ఏంలే అనుకోండి.. గతమూడేళ్ళుగా సాహితీ కండూతిలో వున్నమేమంతా చేరి ఏం చేస్తున్నామో మీకూ తెల్సుగా...అవును విరుదు ఉగాదికి ప్రథమ కవితాసంకలనం హైకుమీద వేయగలిగాం గత ఆగష్టులో "సమత" కవితాసంకలనం వేయించాం ఆ, యిప్పుడూ వేయిస్తున్నాం. ఎంతచిన్న సంఘమయిత్తే మాత్రం మాగుండెలు పొంగుకుంటాయా - నూత్న సంవత్సరం - అందులోనూ, చరిత్రలోనే సువర్ణాక్షరములలో లిఖించేవిగా రేపు జరుగబోయే శ్రీయుతులు జలగం వెంగళరావు, మండలి వెంకటకృష్ణారావుగార్లు తలపెట్టిన ప్రపంచ తెలుగు సాహితీ సమారాధన (ప్రపంచ తెలుగు మహాసభలు) సందర్భంగా ఉగాది నాడు మా "సమత" ను పెళ్ళికూతుర్ని చేస్తున్నాం. ఛందస్సు: మాకు ఛందస్సు ఎక్కడిదండీ! మాకు ఛందస్సు వుండడానికి మేం ఆస్థానరచయితలం కాదుగా...ఏదో మీలాంటి వారంతా తలో చెయ్యా వేస్తే మేం ఎలాగైనా పరిగెడతాం, నవ్య సాహితీసీమల్లో అడుగిడతాం. ప్రోత్సాహమూ? ఎందరో మహానుభావులు! దేశంలో వారిలో కొందరైనా

# కలాలూ గళాలూ

కుతూహలాలు చాలా ఉంటాయి కవిని కావాలనే కుతూహలంకూడా ఒకటి అసలిలాంటి కుతూహలం పుట్టడమే ఒక అదృష్టం కానీ ఇల్లలకగానే పండుగయిపోదు వీణ పట్టుకోగానే వాయించడం రాదు సహజంగాఉండే ప్రతిభ సాధన వల్ల, అభ్యాసం వల్ల రాణిస్తుంది. రోజుకు పది కాగితాలు నింపుచేస్తూ చెత్తబుట్టలోకి గిరాటువెయ్యడం మాత్రమే అభ్యాసంకాదు. రాసిన పద్యాలూ గేయాలూ పత్రికలకు పంపించి, అవి తిరిగివచ్చేస్తే సంపాదకుణ్ని తిట్టిపోయడం గొప్ప కాదు. రచయితకు పరిశీలన కావాలి. నిరంతరాధ్యయనం కావాలి. పదిమందిలో తన రచనలు చదివి వినిపించే అలవాటు ఉండాలి తనకన్నా పెద్దరచయితల స్నేహం సంపాదించుకుంటూ వారి ఉపదేశాలను గ్రహిస్తూ ముందుకు సాగిపోవాలి. అప్పుడప్పుడూ తన సమవయస్కులైన సహరచయితలతో కలిసిమెలిసి సభలూసమావేశాలూ ఏర్పాటు చేసుకుని, అందులో చదివిన రచనలన్నింటినీ గ్రంథరూపంలోకి తేవడానికి కృషిచెయ్యాలి.

ఈ పైలక్షణాలన్నింటికీ లక్ష్యప్రాయులుగా కనిపిస్తున్న యువకులు - ఎక్కువమంది విద్యార్థులు - కలిసి తీసుకొస్తున్న

కవితాసంకలనమిది. వీరి సారస్వత కేంద్రం అమలాపురం వీరి సంఘం పేరు "సరస." వీరి ధ్యేయం సమత. వీరి ఆశయం కవిత. వీరి ఆశ నవత

పప్పూ నెయ్యీ వేయించి భోజనం పెట్టించండి అని అడిగితే అది కవిత్వం కాలేదు. అప్పుడూ కాలేదు ఇప్పుడూ కాదు; మరొకప్పుడూ కాబోదు. కాని శరత్కాలపు వెన్నెల లాంటి తెల్లని చిక్కని మీగడపెరుగుపోసి అన్నం పెట్టించండి అంటే అది కవిత్వమవుతున్నది ఏ చమత్కారవేశమూ ఏ సౌందర్యస్ఫూర్తి ఏ శోభాలవమూ లేని వాక్యాలు ఎవరినీ ఆకర్షించవు; కనక వాటిని కవిత్వం కాదంటాం. అంటే వర్ణన కవి సహజలక్షణమన్నమాట. ఇదే ప్రతిభ కవిచేత కవిత్వం పలికించే సరస్వతి ఇదే

కవిత్వం వ్రాయడం ఎంత గొప్పదో దాన్ని ఆస్వాదించడం కూడా అంతగొప్పదే. కవికీ ఆస్వాదకుడికీ కూడా భావనాశక్తి ఉండాలి. ఆభావనా శక్తి ఒక ఆల్కెమీ అది అన్నివస్తు సువర్ణీకరిస్తుంది.

"You will find poetry nowhere unless you bring some with you' అంటాడొక సహృదయుడు. ఆలోచనలకు అనుభూతులతో రంగులువేసి చూపించడమే కవిత్వం. మబ్బులు పట్టి మెరుస్తున్న కురుస్తున్న ఆకాశం కవిత్వమే. ఇంద్రచాపం విరిసిన కాసు మొయిళ్లవంటివి కవి రచించే పద్యాలు. వాటిని చదవగలిగిన హృదయం నీకుండాలి

ఆహృదయంతో పాటు చెప్పగల వాక్కు నీకువశమయితే నువ్వూ కవివే. లేకుంటే పాఠకుడివి

'The best words in the best order' అనేది కవితాశిల్పానికి సంబంధించిన పరమరహస్యం. దీనివల్లనే పదాల్లోంచి సంగీతం పుడుతుంది. music of words ద్వారా కవిత్వం ఎన్నో అద్భు లను సృష్టిస్తుంది. ఎన్నో ప్రయోజనాలను అందిస్తుంది.

కవిత్వం కవి భావాలను పాఠకుడికందించగల్గాలి. అంటే కవిత్వం కవిగారి సొంతవ్యాపారం కాదు కవి దాన్ని జాతీయం చెయ్యాలి అప్పటివరకూ కవి ఒక గొంగళిపురుగు. అంతవరకూ కవికి సమాధి తప్పదు. అజ్ఞాతవాసం తప్పదు. రేపు ఆతనే చక్కని సీతాకోకచిలుక.

పద్యం ఎంత చిన్నదయినా ఫర్వాలేదు. అది ఒక వాక్యమే కావచ్చు: నిజం అది కావ్యం అందులోనే పారావారమంత భావం ఉండవచ్చు అలా అరచేతిలో అనంత విశ్వాన్ని ఇమిడించి చూపడానికే కవి నిరంతరం ప్రయత్నించాలి.

గులాబీపువ్వు కాదు కవిత్వం కాని దాని తాజాసెంటు కవిత్వమే. విశాఖపట్టణపు సముద్రంకాదు కవిత్వం కాని దానిమోత కవిత్వమే.

ఇన్ని రహస్యాల రమణీయ భవనం తలుపులు తెరుచుకుని ప్రవేశించాలని ఈయువకులంతా పరమకుతూహాలాన్ని

ప్రదర్శిస్తున్నారు. తత్వదృష్టితో చూస్తే వీరం ఆధునిక చైతన్యంతో ఉద్రేకాలూగుతున్న హృదయాలు కలవాళ్ళు. ఆధునిక కవిత్వం అంటే ఆధునిక కాలానికి చెందిన వస్తువు గలది. అంతేగానీ ఈ కాలంలో కల్పించిందంతా నవ్య కవిత్వం కాజాలదు. ఆధునిక జీవితం ఎదుర్కొంటున్న సమస్యలూ సంఘర్షణలూ వీరి కలాల్లో గళాల్లో కెరటాలుగా వరాలుగా ప్రవహిస్తున్నాయి. ఈ జీవితపు ఆశలూ నిరాశలూ వ్యక్తమవుతున్న ఖండికలివి. ఆధునికత అంటే సమకాలీన సమాజదృష్టి ఆసమాజాభ్యుదయానికి కలంతో సహకరించే ఉద్యమమే ఈ ఉదీయమానుల కవిత. అలా అని వీరంతా కేకలతో పరుగులీయడం లేదు. కాకలిని కూడా అభ్యసిస్తున్నారు. అసలు కవితాశిల్పం కోసం వెదుకుతుంటున్నారు ఈ అన్వేషకులకు ప్రోత్సాహదీపం చూపించడం సాహిత్యవేత్తల కర్తవ్యం. ఈ ఉదీయమానుల ప్రగతి పరిచరణాసక్తి మీద శుభాక్షతలు జల్లడం పెద్దల విధి.

మిరియాల రామకృష్ణ
అధ్యక్షులు
ఆంధ్రఅభ్యుదయరచయితల సంఘం శాఖ
రాజోలు.

రాజోలు
533242

**S. JANAKIRAMA SASTRY, M. A.**
Head of the dept. of english
Rangaraya Medical College
KAKINADA - 3

# నేనెరిగిన స.ర.సం...!

అమలాపురం సమతారచయితల సంఘ కార్యదర్శి యువమిత్రుడు శ్రీ సుదర్శనరావు అనుకోకుండా ఒక రోజు సాయంత్రం వచ్చి, "మాసమతారచయితలసంఘ కవితా సంకలనానికి మీరు పరిచయవాక్యాలువ్రాయాలి" అన్నారు. నాకు ఆనందమూ, ఆశ్చర్యమూ కూడా కలిగాయి. ఆంధ్ర దేశంలో ఎన్నో సాహిత్యసంస్థలు వెలుస్తున్నాయి. కొంతకాలం కృషిచేసి కొంతచరిత్రని మిగిల్చి అంతరిస్తున్నాయి. మరికొన్ని సాహితీసరోవరాలు గ్రీష్మంలో ఎండినా, వర్షాకాలంలో నిండుగావుండి సాహితీప్రియులకు సంతోషదాయకాలవుతున్నాయి. పై రెంటికీ భిన్నంగా, స్థాపించిన నాటినుంచీ అవిచ్ఛిన్నంగా కవితా కార్యక్రమాలు నిర్వహిస్తూ నిత్యచైతన్య విలసితాలుగా నిలిచివున్నసంస్థలు బహుకొద్ది వాటిలో స.ర.సం. ఒకటి. కనుకనే ఈసంస్థ నిర్వాహకుల పట్టుదలకు ఆశ్చర్యమూ, వారికృషికి ఆనందమూ కలగటం.

స. ర. సం. ఆవిర్భావకాలంలోనే మూడు కవితాసంకలనాలను ఆంధ్రపాఠకులకు అందించిందనటమే చాలు, ఆసంస్థ నిర్వాహకులో సభ్యులు ప్రదర్శిస్తున్న ఉత్సాహాన్ని తెలుపటానికి. పదహారుమంది యువకవుల మనస్సులకు దర్పణంగా వెలువడుతున్న ఈసంకలనంలో ఎంతో వైవిధ్యం కనబడుతున్నది. భగవత్‌స్తుతి మొదలుకొని వర్తమాన సామాజిక జీవితవర్ణనవరకూ ఎన్నో విషయాలమీద రచించబడ్డ కవితలు ఆయాకవుల ఉత్సాహానికీ, ప్రతిభావిశేషాలకూ నిదర్శనాలు. ఆంధ్రకవితా సరస్వతి నర్చించటానికి ఉత్సాహంతో ముందడుగు వేస్తున్న ఈ యువకవి మిత్రులకు నా ఆశీస్సులందజేస్తూ ముందుముందు మరింతభావనాబలాన్నీ ప్రతిభనూ సంతరించుకొని మరిన్ని కవితాసంకలనాలను వీరు వెలువరించగలరని ఆకాంక్షిస్తూ సెలవుతీసుకుంటాను.

(సం) జానకీ జాని.

---

## నా మాట...

సాహితీ సంచలనాలు, సంకలనాలు అధికమైన ఈ రోజుల్లో అమలాపురంలోని "సమతా రచయితలసంఘం" చాలాకృషి చేస్తున్నందుకు, ఆసమితిలోని యువకుల్నీ విద్యార్థుల్నీ ప్రశంసిస్తున్నారు. కాని, ఈనాటిసంక్షుబ్ధ సామాజిక వాతావరణంలో కవిత్వం సమస్యా పరిష్కారానికి వినియోగపడాలి;

ఉంది. కాబట్టి సాంఘిక రాజకీయాది విషయాల్లో సిద్ధాంతాల్ని ఏర్పరచుకుని, కవిత్వాన్ని సమాజప్రయోజనానికి వినియోగపరిస్తే, ఈ సమితి సమకాలీక పరిస్థితుల్లో ఒక స్థానం సంపాదించుకోగల్గుతుందని భావిస్తాను.

ఆద్దేపల్లి రామమోహనరావు.
తెలుగు లెక్చరర్
M. S. N. Charities College,
కాకినాడ.

/——/

## సోదర (స. ర. సం) యువకవులకు
## ఉగాది శుభాకాంక్షలు

మీరు చేస్తున్న సాహిత్యకృషి ఈరోజు మీ కార్యదర్శి శ్రీ ఆచంటసుదర్శనరావు వ్యాసంలేని అవిధిలోంచిచూశా.. మీ కవితలు నిజంగా మీ గుండెల లోండల్లోంచి ఉదయించినవే.

నేటి సమాజానికి ఉపయోగించే, మనిషిలోని పశువుని దించేసి, మంచిని పెంచేదిఅయి సమకాలీన సమస్యలకు దర్పణప్రాయంవంటి రచనలు యింకా మీనుండి ఉదయించాలని కోరుతున్నాను.

డి. యస్. యన్. రామం
సహాయ కార్యదర్శి, ఆంధ్రసాంస్కృతిక సమితి
ఇంజనీరింగ్ కళాశాల కాకినాడ.

# అమూల్యాభిప్రాయాలు



గాలికిపోయేనుడులను ఏరికోరి చక్కగా ఒకచోట చేర్చటంలో వారికృషిప్రశంసనీయం. ముందుముందు స.ర.సం. యింకా అభివృద్ధి చెందాలని ఆశిస్తా.

సి. నారాయణరెడ్డి.
వివేక్‌నగర్. హైదరాబాద్

మీ సమతాదృక్పథం మీ స ర సం. పేరుకూడా చాలా బాగుంది. ఈ యువరచయితలలో సాహితీ ఉత్సాహాన్ని నేప్రశంసిస్తున్నాను. వీరిఅభ్యుదయాన్ని కాంక్షిస్తున్నాను.

దాశరథి.
మైలాపూర్ — మద్రాస్.

నేను ముసలివాడినయిపోయాను. ఈ ముసలివాని సందేశం మీ కనవసరం. మీ చైతన్యం ప్రభంజనంలా ప్రిభవించాలని, మీలో ప్రయోజనాత్మక సాహిత్యం ఉప్పొంగాలని కోరుతున్నాను.

శ్రీ శ్రీ
— మద్రాసు.

# మా గుండెల్లో, గుండెల కొండల్లో



— ఆచంట సుదర్శనరావు

మా
గుండెల్లో
గుండెల కొండల్లో
ఉదయించిన కిరణాలివి !
మా
మనసుల్లో
మనసుల సరసుల్లో
వికసించిన కుసుమాలివి !
మా
యువతల్లో
యువతల నవతల్లో
జనతల మమతల్లో
పూరించిన శంఖాలివి !
మా
కృతుల్లో
ప్రకృతిలో
ప్రకృతి ఆకృతిలో
ప్రభవించిన సంస్కృతులివి !

మా
తల్లి
కవితల్లి
కవితా నవనీతల్లి
నవనీతుల సరితల్లి
ఉప్పొంగిన భావాబ్ధి !

## సంఘంతో సమరం

— చక్కా సత్యనారాయణమూర్తి
B.SC., B. A., B Ed.,

తమోవీధి
కాదునీది !
కాదునాది !
కాని ఆమెది !

తిమిర వీధిలో ఉన్నది
అపమచుది.
ఆసగల్లి, పాసగల్లి
నీడలేక కుమిలుతోంది
వెలుగు లేక కృంగుతోంది

బలము, పతము
మరచిపోయి
నేటి మనుష
జనము కోరి
వెదుకు తోంది !

తమసు మధ్య మనసున్నా,
మనసు నుండి తమసు త్రోలి;
సంఘంతో సమరం సల్పుతోంది !

---

## నిన్ను సృష్టించిందెవరు?

— జి. చంద్రశేఖర్.

నీ మందర సిగబాట నీ అందానికి ఒక అద్దం,
నీ సుందర స్వరూపం మంచి మనసుకు ప్రతిరూపం.
మానవుని సృష్టిలో నీవొక శాశ్వత శిల్పానివి
సౌందర్య దేవతకు నీవొక హంసతూలికాతల్పానివి.
ఈ ఇల మీంద నీవే ఒక ఇంద్రభవనానివి !
భరతమాత భాగ్యానికి భవ్యరూపానివి.

కాని —

కాలరాత్రి ముసుగులో ముంతాజ్ ప్రాణమూర్తివని
షాజహానే కనకంతో కల్పించిన కాంతవని
ఈనాడు చిరిగిన చరిత్రలో ఘోషిస్తున్నది.
ఇంతకూ......?!

నిన్ను సృష్టించినది—
శ్రామికుల స్వేదజలమా ?
షాజహాన్ ధనగళమా ?

# వేప పువ్వు లేదు

— P. V. N. రాజు, B. A.,

వేప పువ్వుకోసం
నాటానొక మొక్క.
ఆ మొక్క,
చైత్రమాసానికి
కల కల లాడే పువ్వులను
చిరు రాకుల దోసిళ్లతో పట్టి
సన్నాహ్వానిస్తుంటే
ఉవ్విళ్లూరుతూ వేప
ఉగాది ప్రసాదం
స్వీకరిద్దామనుకున్నాను.
కాని —
నివాసం కోసం చేరిన పక్షి రాజులు
నిన్ననే పూవులు రాల్చేశాయి
పూవు కోసం వచ్చిన గడకర్రలు
రెమ్మలన్నీ అర్ధరాత్రే విరగకొట్టేయి.
ఈ తెల్లారుగట్ల నేను —
పచ్చడెలా తినేది ?
పండగెలా చేసేది ?

# నవతరానికి నాంది గీతం

— వక్కలంక రామకృష్ణ.

ఎండిన మోడులు చిగురించి
నిరాశోపహతుల బ్రతుకుల్లో,
క్రొత్త ఆశలు రేకెత్తిస్తున్నాయి
మల్లెల మీదనుండి వచ్చే చల్లని పిల్లగాలులు
పూలకు కూడా వలపున్నదని చెప్పిపోతున్నవి.
పూచినది మొదలు, రాలేవరకు
నవ్వుకుంటున్న పువ్వులు,
బ్రతకడం కూడా ఒక కళేనంటున్నాయి!
కమ్మగ పాడే నల్లని కోయిల,
కళకూ, వర్ణముకూ సంబంధం లేదంటోంది!
వేపపువ్వుల్లో మధువులు పిండే తేనెటీగ
వ్యథామయ జీవితాన్ని, మధురంగా మలచుకోమంటున్నది.
అణువణువునా క్రొత్తదనం తొణికిసలాడే
ఉగాది నవతరానికి నాందీగీతం పల్కుతోంది.

# 'ఇన్నాళ్ళకు నీరాక'

– ఆకుబాబా రాజేంద్రప్రసాద్

నవరసాల రుచులతో అనాదిగా
వస్తున్న ఓ నవ ఉగాదీ!
నేడు 'రాక్షస' రూపంలో వస్తున్నావెందుకు ?
నన్ను మన్నించు నీగురించి వ్రాస్తున్నందుకు!
మహిషాసురుడ్ని మర్దించడానికి
కాళీమాత దాల్చలేదా రౌద్రరూపం –
హిరణ్యాకశిపుని వధించడానికి
హరి ఎత్తలేదా నరసింహరూపం –
నేటి దోపిడీ. దౌర్జన్యాలను
అవినీతి పరుల అక్రమాలను
నియంతల నియంతృత్వాన్ని
నల్లబజారుల్లోని కల్తీదారులను
నడి బజారులో నిలబెట్టి
నామ రూపాలు లేకుండా
సంహరించడానికి
ఇన్నాళ్ళకు నీరాక,
ఇన్నాళ్ళకు నీకేక!

# వసంత చైతన్యం

— పెమ్మరాజు గోపాలకృష్ణ.

కొమ్మ కొమ్మ, రెమ్మ రెమ్మ.
కవళిస్తూ, చిగురిస్తూ
పువ్వు పువ్వు నవ్వేస్తూ
వలపు నేమొను వ్వేస్తూ —

కుహూ, కుహూ కోకిలములు.
కూనిరాగ మొలికిస్తూ
జగం నిండ కాంతినింప
కొత్తపాట సాగిస్తూ

మావికొమ్మ వేపరెమ్మ
తీపి, చేదు పరిసరిస్తూ
పువ్వు పువ్వు నున్న తేనె
తీయదనం పరివహిస్తూ

తెలుగు వెలుగు తోటలోకి.
స్వాగతమని తలుపుతీసి,
తెస్తున్నాయి వసంతాన్ని
ఇస్తున్నాయి చైతన్యాన్ని —

# ఊహల లోకంలో ఉగాది

విద్వాన్ పి వి. ఎన్. రాజు B. A.,

ఉగాది జరుపుకుందాం
ఊహల లోకంలో

మానవత్వం మరుగున పడినా
దానవత్వం పెచ్చు పెరిగినా
ఎదురుతిరిగి నిలువలేనిమనం । ఉగాది ।

బ్రతుకులు బరువైనా,
కరువులు ఎదురైనా,
అన్యాయం సహించి
దురాగతం ద్వారం తెరిచినా
కళ్ళు తెరవని మనం । ఉగాది ।

కులమత ద్వేషం
కరడుగట్టుకుపోతున్నా
ముసుగుమనుషులు
మోసంచేస్తున్నా
నిజం తెలిసి నిలబడివున్న మనం

ఉగాది జరుపుకుందాం !
ఊహాలలోకంలో !

# 'సంధ్య'

— S. వెంకటరత్నం.

అందమైన సంధ్యాకన్య
నా హృదయము నానందము లో
ఊదు లాడమంటున్నది
సేదతీరమంటున్నది.

నీలిగాజు పలకవోలె
నిర్మల గోదావరినది
ఆకసపు టందాలను
తనలో చూపిస్తున్నది.

ఇచ్చట పచ్చిక బయళ్లు
పచ్చకంబళ్లను పరచి
రండి వచ్చి కూర్చోండని
మెచ్చటగా పిలువసాగె!

గున్న మావి చివురుల తిని
కోయిలెచటో కూస్తున్నది
దీనుల దుఃఖాలు తీర
వీనుల విందవుతున్నది.

వరిపైరుల నూయలూగి
విరుల పరిమళాలు తాగి
మలయ మారుతాలు నేడు
గిలిగింతలు పెడుతున్నవి.

# క్షణం... క్షణం... సందేహం

— మురళీకృష్ణ.

నేటను రేపంటే అనుమాన మెందుకు?
కనీసం రేపటి రూపాన్నైనా
ఊహించే అవకాశం శూన్యం కనుక.

ఆకాశంలో అపోలో ప్రయోగం -
కాని దానివల్ల ఎందరికి ఉపయోగం?

నింగిని ఉల్కాల వర్షం.
అది కలిగిస్తుందా అందరకీ హర్షం...
సెపాకీల సందుల్లో ఉక్కుగుండ్ల
గుసగుసల వేగం
సామాన్యుని గుండెల "లబ్ డబ్"ల
పాటీరాగం.

సాగర నగరంలో అణు బాంబుల
దాగుడు మూతలు -
ఉప్పొంగే కెరటాలకు నిచ్చెనవేసే
శ్మశాన వాటిక నిశాపిశాచులు.

అరబ్బు, అమెరికా పెట్రోలు ప్రవాహం
ఎన్నడు ఎడతెగని ద్రవ్యోల్బణ దాహం
ఆ ఇద్దరి ఈ ఆమోదం
కాదేమో అందరకీ ప్రమోదం
తెచ్చిందే! ఓ పెద్ద ప్రమాదం.

అందుకే నేడుకు నేనంటే అనుమానం
భవిష్యత్ ఊహాలు మొదటికే శూన్యం
కాదేమో ఇది నిరాశావాదం
అప్పుడేమో అనుభవజ్ఞానం.

## జీవన రాగం!

Accn : 45684

– పి. డి. వి రామచంద్రుడు.

ఉగాది వస్తుందంటే
ఉత్సాహం పొంగి పొర్లుతోంది
ఊహాల ఊయలలో ఊగే మనసు
ఆశల సౌధాన్ని నిర్మిస్తోంది
పచ్చని వలువలతో
ప్రకృతికన్య విహరిస్తోంది
వసంతానికే వన్నె తెస్తుంది.
బ్రతుకు బరువుతో
అలసిన మనసుకు కాస్తంత
విశ్రాంతి నిస్తుంది
విశ్రాంతి పొందిన మనసు
నూతనోత్సాహంతో
జీవన రాగాన్ని ఆలపిస్తుంది !!

ఎక్కడో ఊయల
టక్కున తెగింది.
ఆశల సౌధం నేల కూలింది.
వసంతంలో పీకలవరకూ
లేమావి చిగుళ్లను మెక్కిన
గండుకోయిల మద మెక్కి
కూయటం అసలే మానేసింది.
అసలు కే ఎసరు పెట్టింది!
వసంతానికీ, శిశిరానికీ
తేడా లేకుండా పోయింది!
మధ్యతరగతివాని
మనసు విరిగి పోయింది.
బ్రతుకు బండబారిపోయింది
మనసుకు విశ్రాంతి కరవైపోయింది.
జీవన రాగాలాపానికి
ఊపిరి తరింపిపోయింది
ఉగాది వస్తాంది. వచ్చినట్లే
చల్లగా, మెల్లగా వెళ్లిపోతుంది!
బ్రతుకు బాటలా
అనుభూతులు లేకుండానే
అంతరించి పోతుంది.
ఆశల ఊపిరితో మరో
ఉగాది కోసం; మరో, మరో
ఉగాది కోసం, నిజమైన ఉగాది కోసం
తపించటమే ఈ జీవన రాగం —

# 'వగ్న గీతి'

— చక్కా సత్యనారాయణమూర్తి

సౌభాగ్యశీలీ భరతమాతా
అతులిత భాగ్యసుజాతా
కలకలలాడే నీమోమున కన్నీ రేమమ్మా !
కన్నీటి చారికల్లో చిక్కినచెక్కిలదేవమ్మా !
ఏరీతిగ నిను ఓదార్చేదీ
ఏ మోముతో నిను వీక్షించేదీ ! —
గాంధి చెప్పిన సూక్తులన్నీ
బ్రాంది మీద భక్తితోటి
పట్టుదలగా కట్టగట్టి
కల్చరంటూ కుదువబెట్టేం —
సోషలిజముతో బాసచేసి
సెక్యులరిజము టిక్కుచూపి
అన్ని ఇజములు మిక్సుచేసి
సెల్ఫు ఇజములో కలిపివేసాం. —
దోపిడీలకు రంగుమార్చి
పెదప్రజలకు టోపీవేసి
ప్రజాస్వామ్యం పేరుపెట్టి
ఉన్నవాళ్లను దోచుకున్నాం.—

బక్క ప్రజల పూరిపాకల్లో
ఊరి ఆవల పేటకట్టి
సిక్సు స్టోరీడ్ మేడలకు
దిష్టి బొమ్మల నిలబెట్టాం -
లంచ గొట్టులను పట్టలేక
బంధు ప్రీతిని చంపలేక
మేముకూడా ముదముతీర
లంచగొండిగ మారిపోయాం. -
మూడు అడుగుల గొయ్యితీసి
నిజము నెవ్వడో పాతిపెట్టి
గజము ఎత్తు సీలుచూసి
అబద్ధాన్ని ఆవిష్కరించేం -
అత్తసొమ్మును పట్టుకొచ్చి
దారవోసిన అల్లునట్లు
దేశ ప్రజల సొత్తుతోటి
స్వంత కొడుకుల బతికిస్తున్నాం -
కాని, తల్లి, భరతావనీ! -
మంచి రోజులు రాకమానవు
మనిషిగాను బ్రతక్కమానము
సమత విలువ పెరిగితీరును.
నీనగు మోమును కాంచ గలము.

# ఈ ఉగాదీ - ఇంతేలే!

- కొల్లూరి సూర్యనారాయణమూర్తి

ఓ ఉగాదీ
నీవు వస్తున్నది
ప్రత్యేకంగా
మా కోర్కెలు తీర్చటానికా ?
లేక, మురిపించటానికా ?

నూతన సంవత్సరం వస్తున్నదని,
కొత్తదనం తెస్తుందని, -
ఆశిస్తున్న మమ్మల్ని
హేళన చేయటానికా ?

నీవు అనంత ఉద్యానవనాల్లో విహరిస్తూ
మమ్మల్ని ఎడారిలో ఒయాసిస్సుల్ని
ఊహించుకోమంటున్నావా - ఓ ఉగాదీ...
నీవు వస్తున్న బాటల్ని
నీవు వసిస్తున్న తోటల్ని
చూసి దహించుకోవాలని
రాత్రికిరాత్రే వస్తున్నావా ఓ ఉ గా దీ.
ఈ నూతన సంవత్సర కాంతి
మా మనసుకు భ్రాంతి
చివరకు మిగిలేది నిరాశా, నిస్పృహే, అవునా ?
ప్రతిఏడు ఇంతేగదా ! ఓ ఉ గా దీ.

/——/

# తల్లీ.. నీకా అశాంతి?

- P. S. K. B. ప్రసాద్.

తల్లీ ఏమిటమ్మా నీకీ అశాంతి
ఏల అంతరించినది నీ మోములో కాంతి?
ఏమైపోయినది నీవు కోరుకునే ప్రశాంతి?
భాగ్యవంతులు బాహువుల్లో బంధించి వేశారా!
దేశనాయకులు ఇనుప పిడికిళ్లలో చిక్కించుకున్నారా?
అపేక్షపరులు అరికాళ్ల క్రింద అణచివేశారా
దొంగ వ్యాపారుల చీకటి బజారులో కలిపి వేశారా
ఏమైపోయింది? ఏమైపోయింది?
శాంతికి నిలయం మాదేశం అని చాటి చెప్పాడే చాచాజీ
అహింసే మా సిద్ధాంతం అని ఎలుగెట్టిచాటాడే బాపూజీ
ఏమైపోయాయి వారిపిలుపులు?
సామాన్యుల ఇబ్బందుల్లో ఇమిడిపోయాయా?
కన్నెలుగనె తల్లులలున అబలల ఆక్రందనలో కలసిపోయాయా!
నిరుపేదల ఆకలి మంటలలో పొగలై పోయాయా?
నిరుద్యోగుల నిరాశలతో నీరసించి పోయాయా!
వరకట్న పిశాచి విషపు కోరలకు బలై పోయాయా?
ఆకాశానంటే అధికధరలలో ఐక్యమైపోయాయా?
నిత్యావసరవస్తువులతో కల్తీలై పోయాయా?
ఏమైపోయాయి? ఏమయిపోయాయి?

# విరహ వసంతం

— పి. బి. వి. సత్యనారాయణమూర్తి

ఏమిచెలీ, ఎందులకీ
మధురానందం
మదిలో పెనవేసుకొనియె
మధుర రాగబంధం
ఎన్నడు ఊహించలేని
అదియేదో క్రొత్తదనం
మరియేదో మత్తుదనం
పరిహాసించె పికస్వరం
పరవశించె నాదుస్వరం

కోయిల ఏమని పాడెను
నవ వసంతగీతం !
మయూరమిట్లునర్తించెను
నవ ఉగాది నాట్యం —
కుసుమాస్త్రిండదె పొంచి
వదిలెనేమొ సుమచాపం.
నవోన్మేషనవ్య రాగమై
విరిసెను నవ వసంతం

ఎద అల్లన పులకరించె
నవ భారత శోభ చూచి
చైత్రరథం త్వరితంగా
మైత్రి పెంచవస్తోంది
వలదే, ఓ చెలియా
ఏలనింక ఈ విరహం
మొలకెత్తదు దరహాసం
ఈ బ్రతుకే దుస్సహం

---

## గోపికాగీతం

— రేకపల్లి శ్రీనివాసరావు B.A.B.L.
(అడ్వకేటు)

పల్లవి। మాధవా! మోహనా! కృష్ణా రారా
సుధలు చిమ్ము నీ మురళిని మ్రోగించరా ।మా।

చరణం। నీకొఱకై నేవేచియుంటిరా
నీకడ దాపరికమ్మేలరా ।మా।
అల, యమునాతీరమున పిల్లవాయువులు
ఉల్లము పల్లవింపజేసెనురా ।మా।
పున్నమిచంద్రుడు నవ్వుచుండెరా
కనికరించి వేగమే రారా ।మా।
క్షణమొక యుగముగ గడుపుచుంటిరా
ఇక క్షణమైనా నేతాళజాలరా ।మా।

# నీవే

– కుమారి కూచిబట్ల కృష్ణవేణి

నీవే నీలాద్రీశ్వరా !

నేలను నింగిని నీలిమనిండగ

– మనసులోన నేచూడగా ।నీవే।

కన్నుల నీవదనాంబుజమే

– పెదుల నీమృదువాగమృతమే

ఎడదను నిన్నే భావనచేసి

– విషయాలన్నీ నిలయముచేసి

– మనసులోన నేచూడగా ।నీవే।

అంతటా నిండిన ఆకాశములో

– అనుభవ మందిన ఆనందములో

చిన్మయ రూపము చింతనచేసి

తన్మయమంది సన్నిధిపొంది

మనసులోన నేచూడగా ।నీవే।

/——/

# నగ్న సత్యాలు

— T. R. సోమయాజులు.

ఒకనాడు అమూల్య రత్నరాసులు
ఈనాడు ఆకలి జీవరాసులు.

నిరుద్యోగ స్థితి పెరుగుతోంది
ఆర్థికస్థితి తరుగుతోంది
ప్రతిచోట ఉద్యోగవసతులు
ప్రతినోట చాలినకూడెప్పుడు ?

బుద్ధుని అహింసాజ్యోతి వెలిగేదెప్పుడు ?
ప్రస్తుత హింసారీతి తొలిగేదెప్పుడు ?
స్వేచ్ఛా విహంగముల రెక్కలు నేలరాలుతున్నాయి
పీడిత జనుల డొక్కలు ఆక్రోశిస్తున్నాయి,

ఆడంబరపు కాంతిలో
అవివేకపు భ్రాంతిలో
వేషప్రీతిలో
ద్వేషకీతిలో

అన్యాయము న్యాయమై
అసత్యము సత్యమై
కష్టజీవులు అలమటిస్తున్నా
ప్రకాశిస్తున్నాయి. ప్రకోపిస్తున్నాయి.

---

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున సమతా
రచయితల సంఘం వెలువరించు 'నవత'
కవితా సంకలనముకు శుభాకాంక్షలు :-

---

ఉగాది శుభాకాంక్షలతో :-

శ్రీ వెంకటేశ్వర ఎలక్ట్రికల్స్ & జనరల్ స్టోర్సు,
డీలర్సు :- ఎలక్ట్రికల్ సామాన్లు మరియు ఫాన్లు
హైస్కూలు రోడ్డు, అమలాపురం.

---

ఉగాది శుభాభినందనలతో,

శివశంకర మెడికల్ ఏజన్సీస్,
హోల్ సేల్ మెడికల్ డీలర్సు,
మాచిరాజువీధి, అమలాపురం

---

ఉగాది హృదయ పూర్వక శుభాకాంక్షలతో

ప్రభాత్ ఆప్టికల్సు
అన్ని రకముల కళ్లజోళ్లు సరసమైనధరలకు దొరకుచోటు
సినిమారోడ్డు, అమలాపురం.

---